సాధనప్రవణులగు ధార్మికులను ఆత్మబలసంపత్తికొరకు ఆత్మ యందు దైవతలాభము విశిష్టపురుషార్థము. భూతబలులు నైతికులు. ప్రాణబలులు ధార్మికులు.

మరియు:- పార్థివాధిభౌతికపదార్థసాధితైహలౌకికమాత్ర సుఖసంసాధనము నీతిమార్గము. దివ్యాధిదైవిక పదార్థసాధితైహలౌకిక పారలౌకికోభయవిధ సుఖసంసాధనము ధర్మమార్గము. పరావనతి సంసాధనము గావించి దానిచేతనే స్వోన్నతి సంపాధన మనుకొనుట నీతిమార్గము. స్వోన్నతి సంసాధనము గావించుకొని దానిచే పరావనతి సాధనమైన దనుకొనుట ధర్మ మార్గమునందొక నీతిమార్గమును, అష్టవిధ నీతిమార్గమునం దొక ధర్మమార్గమును, అంతిరాఖ్యానమను నీవిషయము మరొకచో జూచుకొందము :

ఇతి బుద్ధియోగవిద్యారహస్యమ్

నిష్కర్ష.

1. తత్తత్కర్మ విషయక శ్రద్ధానోపపాదికయగు నది విద్య. అది యుపనిషత్తు. గీతయం దది నాల్గువిధములు, 1 కర్మయోగనిష్ఠా, 2 జ్ఞానయోగనిష్ఠా, 3 భక్తియోగనిష్ఠ, 4 బుద్ధియోగనిష్ఠ - యని. (1) లౌకిక వైదిక నిత్యకామ్య సర్వవిధ కర్మైకాంతారంభోపపాదిక యగువిద్య కర్మయోగోపనిషత్తు. ఇందలి యోగశబ్దము కర్మారంభమున ప్రయుక్తము. (2) లౌకిక వైదిక నిత్యకామ్య సర్వవిధ కర్మైకాంత సన్యాసోపపాదిక యగు విద్య జ్ఞాన యోగోపనిషత్తు. ఇందలి కర్మసన్న్యాసము నందు సాంఖ్యశబ్దము ప్రయుక్తము. (3) నిష్కామముగనో,

పరమేశ్వర శరణాగతి సాధనోపాసనా కర్మప్రవణత సకామము గనో భక్తియోగోపనిషత్తు. ఇందలి కర్మారంభమునందుపాసనా శబ్దము ప్రయుక్తము. (4) కామ్యకర్మ ఫలానాసక్తి పూర్వికయు, సర్వవిధశుభ కర్మారంభోప పాదికయు నగువిద్య బుద్ధియోగోపనిషత్తు. ఇందుసాంఖ్యయోగముల కేకత్వమున్నను యోగశబ్దమే యిష్టము.

2. ఈబుద్ధియోగోపనిషత్తులు రెండు భాగము లగును. 1. సమ్యగ్దర్శన లక్షణము, ఆత్మప్రకాశావరణ లక్షణ వాసనా కర్మసంన్యాస రూపమునగు జ్ఞానయోగము మొదటిది. ఇది యారంభక కర్మజనిత వాసనాకర్మ సంన్యాస లక్షణము గలదై సాంఖ్య మనిపించుకొనుచున్నది. తన్నిష్ఠులు సాంఖ్యులు. (2) సమ్యక్చారిత్ర్య లక్షణము సర్వవిధాత్మ బల సిద్ధి సమృద్ధి రూపమునగు కర్మయోగ ముత్తమము. (కర్మసన్యాసా త్కర్మయోగో విశిష్యతే) ఇది యోగమందురు. తన్నిష్ఠులు యోగులు సాంఖ్య యోగములు రెండు నొకటినే యగు శాస్త్రము బుద్ధియోగోపనిషత్తు. దీనికొకదానికే వాసనాత్మక కర్మైకాంత సన్న్యాస ధర్మమును, ఆత్మనిత్య జ్యోతిర్లక్షణ జ్ఞానోపపాదనము నుండుటచే సాంఖ్యత్వము[1]. నిష్కామ సర్వవిధ కర్మైకాంతారంభ దర్శిత్వమునను, సర్వవిధాత్మ బల సిద్ధి సమృద్ధి రూపత్వమునను, యోగత్వము.[2]

(3) ఈ విధముగ నిష్కర్ష సిద్ధించును :— (1) విశ్వప్రవణతచే సర్వవిధ ప్రవృత్త కర్మకరణము : కర్మయోగము. (2) ఆత్మ ప్రవణతచే ప్రవృత్తి నివృత్త్యోభయవిధ కర్మ సంన్యస

నము జ్ఞానయోగము. (3) ఈశ్వర ప్రవణతచే ప్రవృత్తి నివృత్త్యో భయవిధ కర్మకరణము: భక్తియోగము. (4) విశ్వేశ్వరాత్మ ప్రవణతచే సర్వవిధ నివృత్త కర్మకరణము: బుద్ధియోగము.

(4) ఈ బుద్ధియోగోపనిషత్తు ఆచార్యభేదమున (1) భగవద్విద్య, (2) సిద్ధవిద్య, (3) రాజవిద్య, (4) ఆర్షవిద్యయని నాల్గువిధములు. అందు మొదటిది భగవంతుడగు కృష్ణునిచేతనే శ్లోకబద్ధముగ నుపదిష్టము. తక్కిన మూడును అప్పుడప్పుడితర పురాణ పురుషులచే నుపదిష్టములు. ఆయావి తన కిష్టములని యాదరార్థమును స్వమత పుష్టి కొరకును, భగవంతు డను వదించి ప్రదర్శించెను. అట్లు యీ బుద్ధియోగ చతుష్టయి, భగవద్గీతోపనిషత్తు. ఈ శాస్త్ర చతుష్టయ మొక్కచోట సంగ్రహించి పదర్శింప బడినది. ఇదియే గీతా శాస్త్రము:

ఇతి నిష్కర్ష.

ఇతి శ్రీమత్కౌండిన్యసగోత్ర పవిత్ర చల్లా సుబ్బా
రాయ తనూభవస్య కృష్ణమూర్తి శర్మణః
కృతిషు, అనుశ్రుత్యుపనామక శ్రీవిజ్ఞాన
లక్ష్మీనారాయణీయే, ప్రస్థానమీ
మాంసాయాం, శ్రీమద్భగవ
ద్గీతోపనిష ద్విజ్ఞానపరిచ
యోనామ సంక్షేప

గ్రంథః సమాప్తః.